


# సూర్య ఆదివారం

www.suryaa.com

28 మే 2017

# జీవవైవిధ్యానికి ముంచుకొస్తున్న ముప్పు





## ఛైర్మన్‌తో ముఖాముఖి



నూకారపు సూర్యప్రకాశరావు
చైర్మన్, సూర్య తెలుగు దిన పత్రిక

**సార్! బీజేపీ చీఫ్,టీఆర్ఎస్ చీఫ్‌ల మధ్య మాటల యుద్ధం. కామెంట్ ప్లీజ్!**

రాజకీయాల్లో ఇది సహజమే.సవాళ్లు, ప్రతిసవాళ్లు చేసుకోవడం,ప్రజల దృష్టిలో హీరోలు కావడం కొత్తేమి కాదు కదా. ఆయన ఇచ్చాను అంటాడు,ఈయన లేదంటాడు. కాని రాష్ట్రం,కేంద్రాలు ఇచ్చి,పుచ్చుకోవడం అనేది ప్రజాస్వామ్యంలో నిత్యం జరిగే ప్రక్రియే. కొత్తేమి కాదు. దానికి రాజకీయ రంగు పులమడంలోనే ఉంది అసలు చాణక్యం.కాకపోతే ప్రధాని మోదీతో స్నేహం చేస్తూ, పార్టీ జాతీయ అధ్యక్షులు అమిత్‌షాతో కుస్తీ పట్టడం రాజకీయంగాక మరేమవుతుంది?

**సార్! వైజాగ్‌లో జరుగుతున్న టీడీపీ మహానాడులో తెలంగాణ బోనాలు, బతుకమ్మలు..ఇదెక్కడి చోద్యం?**

చోద్యం ఏముంది. టీడీపీ జాతీయ పార్టీ.అన్ని రాష్ట్రాల ఆచారవ్యవహారాలను ఆదరించాలి....తప్పదు. లేదంటే పార్టీకి రాజకీయంగా ఇబ్బందులు తలెత్తుతాయి. తెలంగాణలో జరిగిన మహానాడులో ఏపీ సీఎం, టీడీపీ జాతీయ అధ్యక్షులు జై తెలంగాణ అని అనడం కూడా అందులో భాగమే. మారుతున్న పరిస్థితులను బట్టి మారడం మానవనైజం.అందులో రాజకీయాల్లో సర్వసాధారణమే కదా. అందులో చంద్రబాబు పరిస్థితులకు అనుకూలంగా వేగంగా నిర్ణయాలు తీసుకోవడంలో అపరచాణక్యుడు మరి.

**సార్..అనుమతి లేకుండా యూపీలోని షహరాన్ పూర్ పర్యటనకు కాంగ్రెస్‌నేత రాహుల్ గాంధీ. కామెంట్ ప్లీజ్!**

ఎబ్లిసిటీ స్టంట్! ..రాజకీయ లబ్ధికోసమే! ఏఐసీసీ జాతీయ ఉపాధ్యక్షుని హోదాలో రాహుల్ గాంధి..దళితుల ఇళ్లుతగులబెట్టిన షహరాన్ పూర్ పర్యటనకు వెళ్తున్నారు. భద్రతా కారణాల రీత్యా వీఐపీల పర్యటనలకు యూపీ ప్రభుత్వం అనుమతి ఇవ్వడం లేదు. కాని కాంగ్రెస్ ప్రిన్స్ మాత్రం అనుమతి గినుమతి జాన్తానై అంటు వెళ్తున్నారంటే..అర్థం రాజకీయమేకదా. పైగా అనుమతి లేదు కాబట్టి అక్కడి పోలీసులు ఆయన పర్యటనను అడ్డుకుంటారు. దాంతో మీడియాలో రావాల్సిన పబ్లిసిటీవస్తుంది. అంతా రాజకీయం. పర్యటించారా, లేదా అనే దానికి కన్నా అక్కడ బాధిత దళితులకు న్యాయం జరిగేలా చూడాల్సిన అవసరం అటు ప్రభుత్వానా,ఇటు ప్రతిపక్షాలపైనా ఉందన్నది మాత్రం వాస్తవం.

**మహానాడులో నారా లోకేష్ భజన ఎక్కువైందంటున్నారు. ఎందుకంటారు?**

రాజకీయాల్లో భజనలు సర్వసాధారణం. అది రాజకీయస్వార్థం. మహానాడు, నారావారి విషయానికి వస్తే, ఆయనే పార్టీలో యువరాజు, పైగా మంత్రి..పార్టీలో ఆయన మాట చెల్లుబాటు అవుతుంది. అందుకే భజన తప్పదులేదు నాయకులకు. అయినా అది పూర్తిగా పార్టీ పరమైన కార్యక్రమం. భజం చేసినా, చేయకున్నా ప్రజలకు నష్టం లేదు కాబట్టి, ఈ విషయం గురించి పెద్దగా పట్టించుకోవాల్సిన పని లేదనుకుంటా.!

**ప్రతిఒక్కరికి ఉద్యోగం ఇవ్వలేము అని బీజేపీనేత అమిత్‌షా అంటే చదువుకున్న ప్రతి ఒక్కరికి ఉద్యోగం వచ్చేలా చర్యలు తీసుకుంటున్నాం అంటున్నారు తెలంగాణ మంత్రి కడియం..ఈ రెండు ప్రకటనలు ఎలా అర్థం చేసుకోవాలి?**

ఇక్కడ ప్రకటనలో క్లారిటీ మిస్ అయినట్లుంది. అమిత్‌షా చెప్పింది దేశంలో ప్రతిఒక్కరికి ఉద్యోగం ఇవ్వలేమని. మంత్రి కడియం చెప్పింది ఇంజనీరింగ్ చదివిన ప్రతిఒక్కరికి ఉద్యోగం గురించి. రెండూ సరైనవే. ఎందుకంటే ఇంటికొక ఉద్యోగమే సాధ్యం కాలేదు. మరి దేశంలో ప్రతి ఒక్కరికి ఉద్యోగం యెలా సాధ్యం. ఇక ఇంజనీరింగ్ చదివితే ప్రైవేటు పరంగా అయినా ఇంజనీరింగ్ విద్యార్థులకు ఉద్యోగాలు లభిస్తాయి. ఇంజనీరింగ్ చదివుకున్నోళ్లందరికి అని కడియం తెలివిగా అన్నారు.సో ఇక్కడ ఇద్దరి స్టేట్ మెంట్లు కరెక్టే.

**సార్! జూలైలో సూపర్ స్టార్ రజనీకాంత్ పార్టీని ప్రకటిస్తారట.కామెంట్ ప్లీజ్!**

మంచిదే కదా.ఎంతకాలంగానో అభిమానులు రజనీకాంత్ రాజకీయ ప్రవేశం గురించి ఎదురు చూస్తున్నారు. కాని వారి ఆశ నెరవేరలేదు.కానీ ఈమధ్య రజనీకాంత్ రాజకీయ అరంగ్రేట్రంపై హాట్ హాట్ వార్తలు వండి వారుస్తున్నది మీడియా. కాకా పోతే ఈ విషయం ఆయన సోదరుడు సత్యనారాయణ రావు గైక్వాడ్ ప్రకటించారే కాని. రజనీకాంత్ కాదు మరి. అయితే ప్రస్తుతం తమిళనాడులో రాజకీయాల్లో శూన్యత లేదుకాని, గందరగోళం మాత్రం నెలకొని ఉంది. ఇప్పటికి డీఎంకే,అన్నాడీఎంకలకు తమినాట సరైన ప్రత్యామ్నాయం లేదు. రజనీకాంత్ పార్టీ పెడితే మాత్రం ఆ గ్యాప్ ఫుల్ ఫిల్ అవుతుంది.

**జనసేన నేత పవన్‌కళ్యాణ్‌ను రాయల సీమలో తిరగనివ్వదట, రాయలసీమ రాష్ట్ర సమితి. పైగా ఆయనెవరు సీమలో పోటీ చేసేందుకు అంటూ ప్రశ్నిస్తోంది.ఇది కరెక్టా?**

వందశాతం కరెక్టు కాదు. ఇది ప్రజాస్వామ్య దేశం.ఎవరు ఎక్కడైనా తిరుగొచ్చు. ఓటు హక్కు ఉంటే ఎవరు ఎక్కడి నుంచైనా పోటీ చేయవచ్చు. పవన్‌నే కాదు ఎవరినైనా తిరగనివ్వం అనే హక్కు ఎవరికిలేదు. అలా చేస్తే అది అప్రజాస్వామికం అవుతుంది. ఇలాంటి స్టేట్ మెంట్లు పవన్ ఖాతరు చేయరు.పైగా అభిమానులు అస్సలుఖేర్ చేయరు. ఇదంతా పబ్లిసిటీ స్టంట్‌లా ఉంది అయినా ఎన్నికలు రావాలిగా. వచ్చినప్పుడు చూద్దాం. ఏమి జరుగుతుందో?

మెయిల్ అడ్రస్
SPR publications, Surya Soudha, Plot.No: 185,
M.C.H. NO.258/1/185, siddi vinayaka nagar,
Chandanayak Thanda, Madhapur, Opp: Hi-Tech City, Hyderabad - 500 072

## లెజెండ్




**స్త్రీ స్వాతంత్ర్యం అంతంత మాత్రంగానే ఉన్న యుగంలో, ఇంకా ఇరవైలు దాటని ఓ చక్కని బ్రిటిష్ యువతి, ఒంటరిగా ఆఫ్రికా అడవుల్లో సంచరిస్తూ, చింపాజీల ప్రవర్తన గురించి లోతుగా అధ్యయనాలు చేస్తూ, చింపాజీలకి, మనిషికి మధ్య ఉన్న పరిణామాత్మక సాన్నిహిత్యాన్ని అర్థం చేసుకుని, ఆ రంగంలో అగ్రగామి అయిన శాస్త్రవేత్తగా ఎదిగింది. ఆ యువతి పేరే జేన్ గుడాల్.**

# జేన్ గుడాల్

1934లో లండన్‌లో పుట్టిన జేన్‌కి చిన్నప్పట్నుంచి జంతువులంటే మహా ఇష్టం ఉండేది. జంతువులతో ఆడుకుంటున్నట్టు, మాట్లాడుతున్నట్టు కలలు కనేది. టార్జాన్, డాక్టర్ డూలిటిల్ (ఈ మనుషుల డాక్టరు మనుషుల కన్నా జంతువులకే ఎక్కువగా చికిత్స చేస్తూ ఉంటాడు) వంటి పిల్లల పుస్తకాలు చిన్నతనంలో ఈమెకి ఎంతో స్ఫూర్తి నిచ్చేవి. అందరిలాగానే పెళ్లి చేసుకుని లైఫ్‌లో సెటిల్ అవ్వమన కుండా తన తల్లి వాన్నే కూతుర్ని తనకి నచ్చిన దారిలోనే ముందుకి సాగమని ప్రోత్సహించేది. నీకు ఏం కావాలంటే అది అవ్వు. నువ్వు ఏ రంగాన్ని ఎంచుకున్నా అందులో బాగా పైకొస్తావని నాకు తెలుసు, అనేది ఆ తల్లి...

ఇరవై రెండేళ్ల వయసులో జేన్‌కి తన జీవితాన్ని మార్చేసే ఓ గొప్ప అవకాశం దొరికింది. ఓ లండన్ ఫిల్మ్ స్టూడియోతోపాటు ఆఫ్రికాకి వెళ్లే అవకాశం దక్కింది. అయితే ప్రయాణానికి కావలసిన ఖర్చులు కూడా తన వద్ద లేవు. వెంటనే ఓ హోటల్‌లో వెయిట్రెస్‌గా పనిలోకి దిగి, రాత్రనక పగలనక పని చేసి నాలుగు డబ్బులు వెనకేసింది. తగినంత ధనం పోగవగానే ప్రయాణానికి సిద్ధం అయ్యింది.

ఆ ప్రయాణం 1957లో మొదలయ్యింది. ముందుగా ఆఫ్రికా లోని మొంబాసాలో దిగింది. మొంబాసాలో లూయీ లీకీ అనే పేరుమోసిన పురావస్తు శాస్త్రవేత్త ఉండేవాడు. జేన్ ఆయన్ని కలుసుకుని తన ఆశయాల గురించి విన్నవించుకుంది. జేన్ లోని ఉత్సాహం, శక్తి, జంతువుల పట్ల ఆమెకి సహజంగా ఉండే ప్రేమ మొదలైన లక్షణాలు ఆయన్ని ఆకట్టుకున్నాయి. వెంటనే తనకి అసిస్టెంటుగా పనిచేసే ఉద్యోగం ఇచ్చాడు. టాంజానియాలో ఓ చెరువు సమీపంలో ఉండే చింపాజీలని అధ్యయనం చేసే పనిలో ఆమెని పాల్గొనమన్నాడు. చింపాజీల జీవన రహస్యాలు అర్థమైతే మనిషి యొక్క పరిణామగతం గురించి ఎన్నో రహస్యాలు తెలుస్తాయని ఆయన ఆలోచన.

ఈ అధ్యయనాలు 1960లో మొదలయ్యాయి. ఆ రోజుల్లో జేన్ తల్లి కూడా కూతురుతో పాటు పర్యటించేది. యువ్వనంలో ఉన్న స్త్రీ ఆఫ్రికా అడవుల్లో ఒక్కతే పర్యటించడానికి బ్రిటిష్ ప్రభుత్వం ఒప్పుకోలేదు. కనుక కూతురితో పాటు ఈ పర్యటనలు ఆ తల్లికి తప్పలేదు. మొదటి రెండు వారాలు జేన్‌కి కలిగిన అనుభవాలు కాస్త నిరుత్సాహ పరిచాయి. తనని అంత దూరంలో చూడగానే చింపాజీలు పరుగు అందుకునేవి. పోనీ తను చూసినంత మేరకు కూడా చింపాజీల ప్రవర్తనలో తనకి విశేషంగా ఏమీ కనిపించలేదు. వచ్చిన పని విఫలమయ్యింది అన్న బాధ మనసులో దొలిచేస్తుండగా అనుకోకుండా ఓ సంఘటన జరిగింది. చింపాంజీలు శాకాహారులు అని అంతవరకు జేన్ అనుకునేది. కాని ఒకరోజు ఓ విచిత్రమైన సంఘటన కనిపించింది. ఓ చింపాజీ ఓ చెదల పుట్ట పక్క కూర్చుని ఓ పొడవాటి పుల్లని పుట్టలోకి దూర్చి దాంతో చెదలు పట్టి తింటోంది. పుల్లని ఓ పనిముట్టుగా వాడి, దాంతో ఆ వురుగులని వేటాడి తినడం తనకి ఆశ్చర్యంగా అనిపించింది. గిట్టలు, కొమ్ములు, ముక్కులు, పంజాలు మొదలైన దేహాంగాలని కాకుండా మరో వస్తువుని పనిముట్టుగా వాడి ఆహారాన్ని సేకరించడం జంతులోకంలో అరుదైన విషయం. ఆ రోజుల్లో పెద్దగా తెలియని విషయం. పనిముట్లు వాడే దశ ఆదిమానవుడి పరిణామ క్రమంలో ఓ ముఖ్యమైన మలుపుగా చెప్పుకుంటాం. అలాంటి పనిముట్ల వినియోగం ఈ జంతువులలో కనిపించడం విశేషం.

చింపాజీలలో ఈ పనిముట్ల వినియోగం గురించి ప్రొఫెసర్ లీకీ కి వివరంగా ఉత్తరం రాసింది. ఆయన సంతోషం పట్టలేకపోయాడు. దీంతో పనిముట్లు, మనిషి మొదలైన పదాలకి కొత్త నిర్వచనాలు ఇవ్వాలి, లేదా చింపాజీలు మనిషితో సమానమని ఒప్పుకోవాలి, అంటూ ఆయన ఉత్సాహంగా జవాబు రాశాడు.

తరువాత జేన్ ధ్యాస చింపాజీలలో సాంఘిక జీవనం మీదకి మళ్లింది. మనుషులలో లాగానే చింపాజీలలో కూడా విస్తృతమైన సాంఘిక పారంపర్యం ఉంటుంది. నువ్వెక్కువా? నేనెక్కువా? అన్న ఛేటీ మగ చింపాజీల మధ్య తరచు వస్తుంటుంది. బలప్రదర్శనతో మగ చింపాజీలు ఇతర చింపాజీల మీద తమ ఆధిక్యతని చూపించుకునే ప్రయత్నం చేస్తుంటాయి. ఆ బలాబలాల పోటీ గెలిచిన మగ చింపాజీని ఆల్ఫా మేల్ (మొదటి మగాడు!) అంటారు. అతడే ముఠా నాయకుడు అవుతాడు. అయితే అంతకన్నా బలమైన చింపాజీ రంగప్రవేశం చేసినప్పుడు, ఇంద్రపదవి లాగా ఈ పదవి చేతులు మారిపోతుంటుంది! చింపాజీలు సాధు జంతువులు ససేమిరా కాదని తెలుసుకుని జేన్ నిర్ఘాంపోయింది. చింపాజీ ముఠాల మధ్య కొట్లాటలు తరచు జరుగుతుంటాయి. ఒక ముఠా నాయకుడు తన ముఠాతో సహా వెళ్లి శత్రు ముఠా మీద యుద్ధం ప్రకటిస్తాడు. ఆ యుద్ధంలో బలమైన చింపాజీలు బలం తక్కువైన చింపాజీలని తీవ్రంగా గాయపరచి, ఆ గాయలతోనే ప్రాణాలు వొదిలే స్థితికి తెస్తాయి. మనుషుల్లో గ్యాంగ్ వార్‌లకి ఈ కలహాలకి పెద్దగా తేడా ఉన్నట్టు లేదు.

జేన్ చేసిన ఈ ప్రప్రథమ అధ్యయనాలన్నీ చక్కని ఫోటోలతో సహా ఆ రోజుల్లోనే నేషనల్ జ్యాగ్రఫీ పత్రికలో అచ్చయ్యాయి. ఆ ఫోటోలు తీసిన హ్యూగో వాన్ లావిక్‌ని ఆమె తరువాత వివాహం చేసుకుంది.





రాత్రిపూట సూర్యుడు కనిపించలేదని కన్నీరు కారుస్తుంటే ఆఖరికి నక్షత్రాలు కూడా నీకు కనిపించకుండా పోతాయి. -రవీంద్రనాథ్ ఠాగూర్

నవకవిత్వం

## ఆజన్మాంతం వరమే...

అమ్మతనం పాతబడదు
అమ్మ భాష మరుగుపడదు
తేనెకన్నా మధురం
విరుల కాన్న సుందరం
తరతరాల కీర్తి కిరీటం మాతృభాష!...

వర్షించే తమస్సు మేఘం
ఉదయించే ఉషస్సు వేకువ
గట్టుపై చేసే పాలపిట్ట అరుపు
చెట్టుపై కూసే కోకిల కూత
అప్పుడు ఇప్పుడు ఎప్పుడూ ఒక్కటే!...

కడుపు మండించే ఆకలి
సిరులు పండించే పొలాలు
ఏనాటివైనా...
మౌళిక భావనలో మార్పులేమీ లేవు!...

పరభాషా వ్యామోహంలో పడి
పాతదంటూ...
ప్రయోజనం శూన్యమంటూ...
వట్టి పిట్ట కథలు వినొద్దు
మాతృ భాషకు మచ్చ తేవద్దు!...

విలువైన విద్యాభ్యాసానికి
మాతృ భాషే సరైన పునాది
కాదని కాలరాస్తే
కోరుకున్న వికాసం సమాధే!...

కొత్తనీటిని తనలో కలుపుకొని
కదిలి వెళ్లే జలధి.. మాతృ భాష
తెలుగు వారికే కాదు
మానవాళికే మేలు చేసే
మహోన్నత తరువు.. మాతృ భాష!...

– కొండూరు వెంకటేశ్వరరాజు,
గూడూరు, నెల్లూరు జిల్లా

## రన్నింగ్ వాయిస్


సూర్య ఆదివారం
ఉగ్రభూతం - ప్రగతికి విఘాతం

### పజిల్స్ పెంచాలి

ఈ వారం వింతలు విశేషాలు ఎంతగానో బాగున్నాయి. వాస్తు సమాధానాలు సంతృప్తికరంగా ఉంటున్నాయి. న్యూమరాలజీ ద్వారా సమస్యలను పరిష్కరించుకుంటున్నాము. చక్కని శీర్షికను ఇలాగే కొనసాగించండి. పిల్లల పేజీలు పెంచితే బాగుంటుంది. ఎక్కువగా పజిల్స్ ఇస్తే మరింత బాగుంటుంది.

–హేమంత్, మౌలాలి

### కలర్ పేజీలు

కవర్ పేజీ కథనం సందర్భోచితంగా ఉంటోంది. పబ్లిక్‌ను ఇన్‌వాల్వ్ చేసే శీర్షి ఎకలు ఇస్తే బాగుంటుంది. అలాగే పాఠకుల అనుభవాలతో కూడిన ఓ శీర్షిక నిర్వహించండి. యూత్‌ను ఎంకరేజ్ చేసే శీర్షికలు, ఆడవారికి నచ్చే ఐటమ్స్ అన్నీ కవర్ అయితే సండే మరింత జనరంజకంగా ఉంటుంది. అన్నీ కలర్ పేజీలలో ఉండేలా చూడండి.

**వింతలు విశేషాలు**

ఈ వారం వింతలు విశేషాలు ఎంతగానో బాగున్నాయి. వాస్తు సమాధానాలు సంతృప్తికరంగా ఉంటున్నాయి. న్యూమరాలజీ ద్వారా సమస్యలను పరిష్కరించుకుంటున్నాము. చక్కని శీర్షికను ఇలాగే కొనసాగించండి. పిల్లల పేజీలు పెంచితే బాగుంటుంది. ఎక్కువగా పజిల్స్ ఇస్తే మరింత బాగుంటుంది.

## 'కూని'రాగాలు

**సలహాలతో సగం రేయిని పోనీకు..!**
**సాయంతో సొంత స్థితిని జార్చకు..!!**

**జీవితం తెగిన గాలిపటం కానీకు..!**
**సంబంధం శ్రుతిలేని రాగం చేయకు..!!**

**వీలైనప్పుడల్లా విధిని నిందించకు..!**
**జాలేసిందని అతిని ప్రదర్శించకు..!!**

**మెత్తగా తాకితే కొత్తలో చిత్తే..!**
**మాటల్తో బోల్తా అలవాట్లో చిక్కే..!!**

**ఊసుల బాటలో బాసలు ఎన్నో..!**
**నవ్వుల హాయిలో ఉక్కలు ఎన్నో..!!**

- కూనిరెడ్డి శ్రీనివాస్

## జోక్స్

**ప్రేమించట్లేదేమో?**

**శ్రీరాం:** 'లలిత నన్ను ప్రేమించడం లేదనిపి స్తుందిరా!

**ఉపేంద్ర:** ఏం...అలా అని చెప్పిందా?

**శ్రీరాం:** ఆవేశంలో ఉన్నపుడు నీకోసం కొండమీద నుండి దూకమన్నా దూకుతాను, సముద్రంలో ఈదమన్నా ఈదుతాను అంటే ఆ పనులన్నీ చేసి చూపించమంది.

**ఏదో లోపం!**

ఓ అందమైన అమ్మా యి డాక్టర్ గదిలోకి హడావుడిగా జొరబడింది.

'నాలో ఏదో లోపం ఉంది డాక్టర్! దయచేసి పరీక్ష చేయండి.'అందామె దిగులుగా.

'మొదటిదేమిటంటే మీకు మేకప్ ఎక్కువగా ఉంది. రెండోది మీ కంటిచూపు సరి గ్గా లేదు. బయట నా నేమ్ బోర్డు మీద 'పశువుల డాక్టర్' అని ఉంది అన్నాడు డాక్టర్ తాపీగా.

**చివరి ఘడియలు...**

భర్త మంచం మీద అవసానదశలో ఉన్నాడు.

'సుబ్బూ...నా ఆయుష్షు తీరిపోయింది. నేను వెళ్లిపోతున్నాను.' మూలుగుతూ అన్నాడు పరంధామయ్య.

'మీరు లేకుండా నేను ఎలా బతకనండీ? నేనూ మీతో పాటే వస్తాను.' ఏడుస్తూ అంది సుబ్బలక్ష్మి.

'ఓసీ నీయమ్మ కడుపు మాడ! చచ్చిన తర్వాత కూడా నన్ను సుఖపడనీయవా ఏంటే?' చివరి మాట అన్నాడు పరంధామయ్య.

ఫన్ చ్

నారు












ప్రదర్శన ముగియగానే ప్రేక్షకులు వెళ్ళిపోయినట్టుగా ధనం ఎంతయినా చివరకు నశించిపోయేదే.-తిరుక్కురళ్







ది జంగిల్ బుక్ అమెరికాకు చెందిన ఒక యానిమేటెడ్ చిత్రం . దీన్ని వాల్ట్ డిస్నీ సంస్థ నిర్మించింది. ఈ సంస్థకు ఇది 19వ యానిమేటెడ్ చిత్రం. రుడ్యార్డ్ కిప్లింగ్ మోగ్లీ అనే అడవిలో పెరిగిన పిల్లవాడి కథను ఆధారంగా చేసుకుని ది జంగిల్ బుక్ రచించాడు. పిల్లల కోసం మిక్కీ మౌజ్, మిని, డోనాల్డ్ డక్ వంటి కార్టూన్‌లతో సరికొత్త బొమ్మల ప్రపంచాన్ని సృష్టించిన వాల్ట్ డిస్నీ ఈ చిత్రం నిర్మాణ దశలో కన్నుమూశారు. భారతదేశంలోనూ ఈ చిత్రం, తరువాత వచ్చిన సీరియల్స్ పాపులారిటీని సంపాదించాయి. హిందీలో జంగల్ జంగల్ పతా చలా హే. చడ్డీ పహన్ కె ఫూల్ ఖిలా హే పాట నేటికీ హిట్.

# ఇప్పటికీ కొత్తదనమే

# ది జంగిల్ బుక్

మధ్యప్రదేశ్‌లోని ఒక దట్టమైన అడవిలో బాస్కెట్‌లో ఉన్న మోగ్లీని ఒక నల్లని పులి-బఘీరా కనిపెడుతుంది. వెంటనే మోగ్లీని తీసుకుని ఒక తోడేలు దగ్గరికి తీసుకెళ్తుంది . తోడేలుకు అప్పుడే పిల్లలు పుడతారు. దాంతో తన పిల్లలతో పాటు మోగ్లీని కూడా పెంచుకుంది . అడవి జీవులతో,వన్య జీవితంతో చక్కగా కలిసి పోతాడు మోగ్లీ. కొంత కాలం తరువాత టీనేజి కుర్రాడిగా ఎదుగుతాడు.

**షేర్‌ఖాన్ ఎంట్రీ:**

ఒక రోజు రాత్రి అడవిలో మనుషులను తినే బెంగాల్ టైగర్ షేర్ ఖాన్ వచ్చిందని బఘీరాకు తెలుస్తుంది. దీంతో మోగ్లీ అడవిలో ఉండటం ఇక అంత సురక్షితం కాదని భావించి అతడిని దగ్గరిలో ఉన్న మనుషులు నివసించే గ్రామానికి పంపించాలని నిర్ణయిస్తుంది. అదే రోజు రాత్రి బఘీరా మోగ్లీని తీసుకొని బయల్దేరుతుంది. అంతలోనే ఖా అనే పైథాన్ మోగ్లీని చూసి హిప్నటైజ్ చేసి తన అదుపులో తీసుకుంటుంది. స్పృహ కోల్పోయిన మోగ్లీని తినాలని ప్రయత్నించి విఫలమౌతుంది. మరుసటి రోజు ఉదయం తను అడవిలో ఉండాలను కుంటున్నానని మోగ్లీ చెప్పడంతో నీ ఇష్టం వచ్చినట్లు చేయమని చెప్పి బఘీరా వెళ్ళి పోతుంది

**బల్లూ:**

ఇలా ఒంటరైన మోగ్లీకి సరదాగా జీవితాన్ని గడపాలి అని భావించే ఒక నల్లని ఎలుగుబంటి కనబడుతుంది. దాంతో స్నేహం కుదిరాక దానితో తాను అడవిలోనే ఉండాలనుకుంటున్నాను అని చెబుతాడు మోగ్లీ. దీంతో అడవిలోనే ఉండేలా సహాయపడతానని చెబుతుంది బల్లూ. ఇంతలోనే బల్లూని, మోగ్లీని కింగ్ లూయి (ఒరాంగ్ ఉటాన్) కోతులు కిడ్నాప్ చేస్తాయి. తనకు ఎర్రని పుష్పం (నిప్పు) ఎలా తయారు చేస్తారో చెబితే వదిలి వేస్తానని షరతు పెడుతుంది లూయి. కానీ మోగ్లీకి ఆ విద్య తెలి యదం ఎలాగో అక్కడి నుంచి తప్పించుకు వెళ్తారు బల్లూ, మోగ్లీ. తరువాత బల్లూ కూడా మోగ్లీని మనుషుల దగ్గరికి వెళ్లమని చెబుతాడు. దీంతో మోగ్లీ అక్కడి నుంచి వెళ్లిపోతాడు.

**కల్నల్ ఏనుగు:**

మోగ్లీ కనిపించపోవడంతో బల్లూ, బఘీరా కల్నల్ ఏనుగు సహాయం తీసుకుంటారు. మోగ్లీని మళ్లీ ఖా హిప్నటైజ్ చేసి తినాలనుకుంటుంది. మోగ్లీ ఎలాగో తప్పించుకుంటాడు. అడవిలో ప్రవేశించగానే షేర్ ఖాన్ ఎదురౌతుంది. అంతలోనే ఆకాశం నుంచి పిడుగులు పడటం వల్ల చెట్లకు మంటలంటుకుంటాయి. మోగ్లీ వెంటనే ఒక కర్రకు అంటుకున్న నిప్పును తీసుకుని షేర్‌ఖాన్ తోకకు అంటిస్తాడు. షేర్‌ఖాన్ నీటి వైపు పరిగెత్తుతుంది. ఇంతలోనే మోగ్లీని వెదుక్కుంటు బఘీరా, బల్లూ, కల్నల్ ఏనుగులు వస్తాయి. మోగ్లీని మనుషుల నివాసానికి తీసుకెళ్తుండగా మధ్యలో ఒక చెరువు వద్ద ఒకమ్మాయి నీళ్లు పట్టుకోవడానికి వస్తుంది. ఆమె బిందె నీళ్లలో పడిపోవడంతో మోగ్లీ దాన్ని అందిస్తాడు. దీంతో వారి మధ్య స్నేహం కుదురుతుంది. మోగ్లీ ఆమె వెంటనే వెళ్తూ గ్రామంలోకి ప్రవేశిస్తాడు. ఇక కథ కంచికి మనం ఇంటికి.

**67లో వచ్చిన యానిమేషన్ మూవీ:**

సాహసం, వినోదం అంశాలతో వాల్ట్ డిస్నీ సంస్థ 1967లో నిర్మించిన యానిమేషన్ చిత్రం 'జంగిల్ బుక్' అప్పట్లో అది ఒక సంచలనం. ఇప్పటికీ అది టీవీ ప్రసారాల ద్వారా పిల్లల్ని ఎంత గా నో ఆకట్టుకుంటోంది.

**మరో సారి 3 డిలో:**

ఇప్పుడున్న ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించి 3డి లో సరికొత్తగా మరోమారు ' ది జంగిల్ బుక్' చిత్రాన్ని తెరకెక్కిస్తున్నారు. జోన్ ఫేవ్‌ర్యూ ఈచిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు. తాజాగా ఈ సినిమాకు సంబంధించిన అఫీషియల్ ట్రైలర్ రిలీజ్ చేసింది వాల్ట్ డిస్నీ.. చూసిన ప్రతి ఒక్కరు ట్రైలర్ అద్భుతంగా ఉంది అంటున్నారు. సినిమాలోని బాలుడు మోగ్లీ క్యారెక్టర్ తప్ప అన్నీ గ్రాఫిక్సే.. అయినా రియాల్టీని తలపించే లా గ్రాఫిక్స్ ఉండటం గమ నార్హం. ఇక్కడ మరో విశేషం ఏమిటంటే ప్రధాన పాత్ర మోగ్లీగా నటించే అవకాశం భారతీయ - అమెరికన్ అయిన నీల్ సేథీకి దక్కింది. మోగ్లీ పాత్రధారి నీల్ సేథి ఎంపికపై దర్శకుడు జోన్ ఫేవ్‌ర్యూ మాట్లాడుతూ "ప్రపంచవ్యాప్తంగా అనేకమందిని వెతికాం. న్యూయార్క్ నుంచి న్యూజిలాండ్ వరకు, లండన్ నుంచి కెనడా వరకు, అమెరికా, భారతదేశం... మూలమూలలా వెదికిన తర్వాత పదేళ్ళ నీల్ సేథీని ఏకగ్రీవంగా ఎంపిక చేశాం" అని అన్నారు. అడవిలోని జంతువులు పెంచి పెద్ద చేసిన ఓ పసివాడి కథ ఆధారంగా సాగే చిత్రమే ది జంగిల బుక్'. ఈ సినిమా ఏప్రిల్ 15, 2016లో విడుదల అవుతుంది.

మోగ్లీ కనిపించపోవడంతో బల్లూ, బఘీరా కల్నల్ ఏనుగు సహాయం తీసుకుంటారు. మోగ్లీని మళ్లీ ఖా హిప్నటైజ్ చేసి తినాలనుకుంటుంది. మోగ్లీ ఎలాగో తప్పించుకుంటాడు. అడవిలో ప్రవేశించగానే షేర్ ఖాన్ ఎదురౌతుంది. అంతలోనే ఆకాశం నుంచి పిడుగులు పడటం వల్ల చెట్లకు మంటలంటుకుంటాయి. మోగ్లీ వెంటనే ఒక కర్రకు అంటుకున్న నిప్పును తీసుకుని షేర్‌ఖాన్ తోకకు అంటిస్తాడు.

ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించి 3డి లో సరికొత్తగా మరోమారు ' ది జంగిల్ బుక్' చిత్రాన్ని తెరకెక్కిస్తున్నారు. జోన్ ఫేవ్‌ర్యూ ఈచిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు. తాజాగా ఈ సినిమాకు సంబంధించిన అఫీషియల్ ట్రైలర్ రిలీజ్ చేసింది వాల్ట్ డిస్నీ.. చూసిన ప్రతి ఒక్కరు ట్రైలర్ అద్భుతంగా ఉంది అంటున్నారు.

Directed by : Wolfgang Reitherman
Produced by : Walt Disney
Screenplay by :Larry Clemmons
Ralph Wright
Ken Anderson
Vance Gerry
Based on : The Jungle Book by Rudyard Kipling
Starring : Phil Harris
Sebastian Cabot
Louis Prima
George Sanders
Sterling Holloway
Narrated by : Sebastian Cabot
Music by : George Bruns (Score)
Terry Gilkyson
Richard M. Sherman
\Production company : Walt Disney Productions
Release date : October 18, 1967
Running time : 78 minutes
Country : United States
Language : English
Budget : $4 million



అలవాటు అనేదాన్ని అరికట్టకపోతే, అది త్వరలోనే ఒక అవసరంగా మారిపోతుంది.-సెయింట్ ఆగస్టిన్



1980–90ల మధ్యకాలంలో దర్శకుడిగా ఎంట్రీ ఇచ్చారు కోదండరామిరెడ్డి. సంధ్య చిత్రంతో దర్శకుడిగా తన సత్తా నిరూపించుకున్నాడు. కె.రాఘవేంద్రరావు శిష్యుడిగా పరిచయం అయ్యాడు... అందుకే ఆయనలాగే తన ప్రతి పాటనూ ఎంతో రిచ్‌గా చూపించేవాడు. చిరంజీవి, కె.ఎస్.రామారావు, ఎ.కోదండరామిరెడ్డి కాంబినేషన్‌లో వచ్చిన ప్రతి సినిమా బ్లాక్‌బస్టర్ విజయం సాధించింది. కొన్ని బ్యానర్లు కేవలం కోదండరామిరెడ్డి తోనే తమ సినిమాలను తీసి మంచి విజయాలను సొంతం చేసుకున్నాయి. దాదాపు 90కి పైగా సినిమాలు చేసిన కోదండరామిరెడ్డి అందులో 25 చిత్రాలు మెగాస్టార్ చిరంజీవితోనే. చిరును రాత్రికి రాత్రి మెగా హీరోగా మార్చేసిన దర్శకుడు కూడా ఆయనే.



# విజయోత్సవ చిత్రాల దర్శకుడు

1950, జూలై 1న ఆంధ్రప్రదేశ్ లోని నెల్లూరులో కోదండరామిరెడ్డి గారు జన్మించారు. 1980లో 'సంధ్య' సినిమాతో దర్శకుడిగా తెలుగు తెరకు పరిచయమయ్యారు. పట్టున్న కథను గుట్టుగా పట్టి, దానికి అనువైన మసాలాలు దట్టించి, జనాన్ని కట్టిపడేసిన చతురుడు దర్శకుడు ఎ.కోదండరామిరెడ్డి. ఆయన పేరు వినగానే ఠక్కున చిరంజీవి గుర్తొస్తారు. అదేంటి కోదండరామిరెడ్డి పేరు వింటే చిరు పేరు గుర్తుకు రావడమేంటనే ప్రశ్నకు సమాధానం వీళ్ళిద్దరి కాంబినేషన్‌లో వచ్చిన బ్లాక్ బస్టర్ హిట్సే.

చిరంజీవిని టాప్ స్టార్‌గా నిలిపింది నిస్సందేహంగా కోదండరామిరెడ్డి చిత్రాలేనని చెప్పొచ్చు. చిరంజీవి మెగాస్టార్ అయ్యేందుకు ఓ రూపొందించిన కోదండరామి రెడ్డి వంద సినిమాల మైలు రాయి దాటాలని ప్రయత్నిస్తు న్నారు. కె.రాఘవేంద్రరావు శిష్యుడైన కోదండరామిరెడ్డికి దర్శకుడిగా తొలిచిత్రం సంధ్య. హిందీ చిత్రం 'తపస్య' ఆధారంగా తీసారు. కుటుంబ చిత్రంగా ఆ చిత్రం గొప్పగా విజయవంతమైంది. చాలా కొద్దికాలంలోనే పెద్ద హీరోలతో అవకాశాలు వచ్చాయి. చిరంజీవిని తారాపథానికి తీసుకెళ్ళిన ఖైదీ చిత్రం కోదండరామిరెడ్డి దర్శకత్వంలో వచ్చింది. న్యాయం కావాలి చిత్రంతో మొదలైన వీరి సినీ నిర్మాణ బంధం ముఠా మేస్త్రి సినిమా వరకు సాగింది. వీరిద్దరు కలిపి 23 సినిమాలకు పనిచేసారు. అందులో 80% విజయం సాధించాయి. ఆ కాలంలోని కథానాయకుల్లో ఒక్క ఎన్.టి.ఆర్‌తో తప్ప అందరు ప్రముఖ నటులతోనూ చిత్రాలు తీసారు.

అవన్నీ ఫలించలేదు. చివరకు పి.చంద్రశేఖర్‌రెడ్డి కూడా నెల్లూరే కావడంతో ప్రాంతీయాభిమానంతో కోదండరామిరెడ్డిని తన వద్ద చేర్చుకున్నాడు. ఆ తర్వాత వి.మధుసూధనరావుకు పరిచయం చేశారు. అక్కడే కె.రాఘవేంద్రరావు పరిచయం అయ్యారు. ఆ తర్వాత రాఘవేంద్రరావుతో ట్రావెల్ అవుతూ వచ్చారు కోదండరామిరెడ్డి. వి.మధుసూధనరావు వద్ద కూడా అప్పుడప్పుడూ అవకాశం వచ్చినప్పుడు పనిచేశాడు.

అయితే సంధ్య సినిమాకంటే ముందుగా రాం రాబర్ట్ రహీమ్ చిత్రానికి దర్శకత్వం వహించే అవకాశం లభించింది. అయితే ఆ చిత్ర నిర్మాతలు కోదండరామిరెడ్డి కొత్త దర్శకుడు కదా అని ధైర్యం చేయలేకపోయారు. అయితే ఆ చిత్రానికి విజయనిర్మల దర్శకత్వం వహించారు. ఆ చిత్రం హిందీలో అమితాబ్ నటించిన బ్లాక్‌బస్టర్ చిత్రం రామ్ రాబర్ట్



మైలురాయిగా నిలిచిన సినిమా 'ఖైదీ'. చిరంజీ వితోనే కోదండరామిరెడ్డి పలు ప్రయోగాలు చేస్తూ సాగారు... అందుకు తగ్గ ఫలితాలనే సాధిం చారు. ఇదే తరహాలో బాలకృష్ణ, నాగార్జున, వెంకటేష్ తోనూ కోదండరామిరెడ్డి విజయయాత్ర సాగించారు. రెండు దశాబ్దాలుగా దాదాపు 90కి పైగా వైవిధ్యమైన చిత్రాలతో ప్రేక్షకుల్ని మెప్పించిన ఘనత కోదండ రామిరెడ్డిదే అనటంలో అతిశ యోక్తి లేదు. తెలుగు సినిమా చరిత్రలో దర్శకుడిగా తన కంటూ ఓ ప్రత్యేక గుర్తిం పుని, శైలిని కోదండ రామిరెడ్డి సృష్టించుకున్నారు. కోదండ రామిరెడ్డి కొన్ని చిత్రాలకు నిర్మాతగానూ వ్యవహరించారు. అయితే దర్శకునిగానే కోదండరామిరెడ్డి జనం మదిలో నిలచిపోయారు.

ఇప్పటి వరకు 97 చిత్రాలను

కోదండరామిరెడ్డి నెల్లూరు జిల్లా మైపాడులో మధ్య తరగతి వ్యవసాయ కుటుంబంలో జన్మించాడు. ఈయన తండ్రి వెంకూరెడ్డి, తల్లి రమణమ్మ. ఇందుకూరుపేట, నరసాపురంలో చదువు కొనసాగించి, ఎస్.ఎస్.ఎల్.సి దాకా చదువుకున్నాడు. విద్యార్థి దశనుండే నాటకాలంటే కోదండరామిరెడ్డికి పిచ్చి. పీయూసీ చదువుతూ మధ్యలోనే చదువు మానేసి సినిమాల్లో హీరో అవ్వాలనే కోరికతో రైలెక్కి మద్రాసు వచ్చాడు.

హీరోగా అవుదామని: మొదట హీరోగా అవుదామని చాలా ప్రయత్నాలే చేశాడు.




రహీమ్ చిత్రానికి రీమేక్. తెలుగులో సూపర్‌స్టార్ కృష్ణ, రజనీకాంత్‌లు హీరోలుగా నటించారు. తొలి చిత్రమే మల్టీ స్టారర్ చిత్రాన్ని చేసే ఛాన్స్ మిస్ అయ్యారు కోదండరామిరెడ్డి. అయితేనేం తర్వాత తనేమిటో నిరూపించుకుని హీరో కృష్ణకు కూడా ఎన్నో విజయవంతమైన చిత్రాలను అందిం చారు. ఆ రోజుల్లో ఒక్క సీనియర్ ఎన్‌టీ రామారావుతో తప్ప మిగిలిన అందరి హీరోలతో పనిచేసిన ఏకైక దర్శకుడు.

తన కుమారుడు వైభవ్‌ను హీరోగా తెరంగేట్రం చేయించారు. అయితే వైభవ్ హీరోగా అంతగా నిలదొక్కుకోలేకపోయాడు. ఇంకా అవకాశాల వేటనే కొనసాగిస్తున్నాడు వైభవ్.

చిరంజీవితో ఖైదీ చిత్రం చేసేముందర ఆ స్టోరీకి హీరో కృష్ణను సంప్రదించడం జరిగింది. అయితే కృష్ణ బిజీగా ఉండి హీరో చిరంజీవి పేరును ప్రపోజ్ చేయడం జరిగింది. అంతే ఆ సినిమాతో చిరంజీవి స్టార్‌డమ్ ఒక్కసారిగా మారిపోయింది. కోదండరామిరెడ్డితో చిరంజీవి దాదాపు 25 సినిమాలు చేశాడు. అందులో ఎక్కువ శాతం విజయం సాధించాయి. క్రియేటివ్ కమర్షియల్స్ బ్యానర్ నిర్మాత కె.ఎస్.రామారావుతో గట్టి అనుబంధం ఏర్పడింది. వరుసపెట్టి అభిలాష, ఛాలెంజ్, రాక్షసుడు, మరణమృదంగం, స్టువర్ట్‌పురం పోలీస్ స్టేషన్ వంటి నవలా చిత్రాలకు దర్శకత్వం వహించాడు కోదండరామిరెడ్డి.

## తెలుసుకోండి'లా'

# వారంటీకి గ్యారెంటీ లేదా!

నేను మా మండల అధికారి గారికి సమాచార చట్టం క్రింద గ్రామం యొక్క నక్ష కాపీ పూర్తి వివరాలతో ఇవ్వమని కోరుతూ రూ॥ 150లు రుసుము చెల్లించి దరఖాస్తు చేసుకొని దాదాపు 6 నెలలు అయ్యింది. అయినా అక్కడ నుండి ఎలాంటి సమాచారం రాకపోవడంతో జిల్లా రెవెన్యూ అధికారిగారికి గతంలో ఇచ్చిన కాపీ జిరాక్స్, రుసుము చెల్లించిన రశీదుతో కలిపి సమాచార చట్టం ప్రకారం అప్పీలు చేసుకొన్నాను. అయినా ఇంతవరకు ఎలాంటి సమాచారం రాలేదు. ఇప్పుడు నా కేసు వినియోగదారుల చట్టం క్రింద వర్తిస్తుందా లేదా తెలుపగలరు.

– ఎస్. సుబ్బారావు, పోలవరం, ప॥ గో॥ జిల్లా

మీరు సమాచార చట్టం ప్రకారం అప్లికేషన్ పెట్టడం, దానికి రుసుము చెల్లించడం, దానికి సంబంధించిన రశీదును కూడా మీ దగ్గర ఉంచుకోవడం చాలా ఉపయోగకరం. మీరు ఆ రుసుము చెల్లించడంతో మీకు వినియోగ ఫోరంలో చట్ట ప్రకారం అర్హుడయ్యారు. ఆ రుసుము చెల్లించకపోయి ఉంటే వినియోగదారుల ఫోరం వర్తించేది కాదు. అక్కడ మీరు రెవెన్యూ జిల్లా అధికారిని పార్టీ కింద చేసారు. కనుక మీ కేసు రాష్ట్ర వినియోగదారుల ఫోరంలో వేసుకోవచ్చును. మీకు తప్పక న్యాయం జరుగుతుంది. దానిలో మీకు జరిగిన నష్ట పరిహారం, కోర్టు ఖర్చులు మొదలగునవి వచ్చును. మీకు ఆలస్యం జరిగినందుకు వాళ్లకు జరిమానాతో పాటు శిక్ష కూడ విధించే అవకాశం కూడా ఉన్నది.

★★★

అయ్యా! నేను మా జిల్లాలో ఒక బ్రోకర్ ద్వారా ఒక బిల్డర్ దగ్గర నా యొక్క ఉద్యోగంతో బ్యాంకు లోను తీసుకొని ఒక అపార్ట్‌మెంటులో (2వ ఫ్లోర్‌లో) 1300 చ॥ అడుగుల ఫ్లాట్ కొన్నాను. ఆ ఫ్లాట్‌ను బిల్డర్ నా పేరు మీద రిజిష్టర్ చేసాడు. అప్పుడు బిల్డర్ నాకు టేకు డోర్లు, బయట పక్క గ్రిల్స్ పెట్టి, కారు పార్కింగ్‌తో సహ ఇస్తామని రాసి ఇచ్చాడు. ఇప్పుడు ఆ బిల్డర్ బిల్డింగ్ పొజిషన్ ఇచ్చాడు. కానీ, నాసిరకం డోర్లు పెట్టి తరువాత గ్రిల్స్ కూడా పెట్టనంటున్నాడు. కారు పార్కింగ్ నాకు సేల్ డీడ్‌లో రాసి అదే వేరే వారికి ఇచ్చాడు. అదేంటి అని అడగగా నాకు నష్టం జరిగింది. కనుక వేరే వారికి ఇచ్చాను అని అంటు న్నాడు. కావున న్యాయపరంగా నేను అతనిమీద ఏ విధ మైన చర్య తీసుకొనవలెను. దయచేసి నా సమస్యకు పరిష్కారం చెప్పగలరు.

– శ్రీధర్‌రెడ్డి, ఖమ్మం జిల్లా




మీరు బిల్డర్ ద్వారా కొన్నారు కాబట్టి మీకు బిల్డర్ మోసం చేసాడు. మీరు డబ్బు ఇచ్చినప్పుడు విలువైన కర్రతో (టేకు) చేసి ఇస్తానని ఒప్పుకొన్నాడు అని, కారు పార్కింగ్ కూడా ఇస్తామని చెప్పి వేరే వారికి ఇచ్చాడని రాశారు. అతని యొక్క లాభనష్టాలతో మీకు సంబంధం లేదు. కావున ఆ విషయాలన్నీ మీకు సంబంధం లేనివి. మీకు జరిగిన అన్యాయం గురించి మాత్రమే మీకు సంబంధం. కావును మీ ఇద్దరి మధ్యలో క్రయ విక్రయ వ్యవహారాలు జరిగినవి. రెండోది మీకు ఒప్పందాలను అతను నెరవేర్చకుండ మోసం చేసాడు. కావున దానికి మీ సమీప పోలీసు స్టేషన్ లేక కోర్టు ద్వారా గానీ బిల్డర్ పై మోసపూరిత కేసు పెట్టగలరు. అదే విధంగా మీరు జిల్లా వినియోగఫోరంలో కూడా కేసు వేయవచ్చు. మీకు తప్పక న్యాయం జరుగును.

★★★

నేను మా దగ్గర్లోని ఎలక్ట్రికల్ టీవీ షాపు ద్వారా బజాజ్ ఫైనాన్స్‌లోలోనుతో రూ॥ 46,000 ఎల్‌సీడీ టీవీని వాయిదాల పద్ధతిలో కొన్నాను. కొన్నప్పుడు షాపు యజమాని నాకు రెండు సం॥ల వారంటీ కార్డ్ ఇచ్చినాడు. కానీ, ఆ టీవీ నేను కొని ఇంటికి తెచ్చిన 2 నెలలకే పని చేయడం లేదు. వెంటనే షాపు యజమాని దగ్గరకు వెళ్లాను. ఇది మైనర్ ప్రాబ్లం అని చెప్పి రిపేరు చేసి ఇచ్చాడు. అయినా అది వారం రోజులు కూడా నడవలేదు. మళ్లీ అదే షాపుకు తీసుకెళ్లాను. మరల రిపేరు చేసి ఇచ్చాడు. అయినా ఒక నెలకూడా నడవలేదు. దీని మీద నేను బజాజ్ ఫైనాన్స్ వారికి లెటర్ రాశాను. దీని పై వారి నుండి ఎలాంటి స్పందన లేదు. షాపు వాడు ఇది తీసుకొని వేరేది ఇవ్వమంటే ఇవ్వడం లేదు. నేను ఫైనాన్స్ నెల వాయిదాలు ఆపేశాను. ఈ విషయంలో నన్ను ఏమి చెయ్యమంటారు. న్యాయపరిష్కారం చెప్పండి.

– కృపాకర్‌రెడ్డి,నల్గొండజిల్లా

మీరు తీసుకొన్న అప్పు వాయిదాలకు దీనికి సంబంధం లేదు. ఎందుకనగా ప్రతి ఫైనాన్షియర్ మీ దగ్గర ఒక లెటర్ తీసుకొంటాడు. అది ఎలాంటిది అనగా నేను తీసుకొన్న వస్తువు మంచి కండీషన్‌లో ఉన్నది కావున దానిపై ఫైనాన్స్ ఇవ్వగలరు అని. అంటే మీరు తీసుకొన్ని వస్తువు మంచిదని నాడే మీరు ఒప్పుకున్నట్లు. కావున ఫైనాన్స్‌కు, మీరు కొన్న వస్తువుకు ఎలాంటి సంబంధం లేదు మీరు నెలసరి వాయిదాలు తప్పక కట్టవలెను. కావును మీకు డీలర్‌కు, మీకు కంపెనీ తయారు చేసిన యజమానికి సంబంధం. కావున ఏ మాత్రం ఆలస్యం చెయ్యకుండా నీదగ్గర వున్న రశీదు మరియు రిపేరు చేసిన రశీధులు కలిపి మీకు అమ్మిన డీలర్‌పై జిల్లా వినియోగఫోరంలో కేసు వెస్తూ... తయారు చేసిన కంపెనీ యజమానిని కూడా పార్టీ చేసి విలువైన వస్తువు ఇవ్వకుండా నాసిరకం వస్తువులు అమ్మినందుకు, తయారు చేసినందుకు కేసు వేయగలరు. దానియొక్క విలువతో పాటు నష్టపరిహారం, కోర్టు ఖర్చులతో సహ మీకు న్యాయం జరుగును.

# నేనంటే ఎవరికీ పడదు

## లక్కీ నంబర్

నా పుట్టినతేదీ 10-2-1975. ఎప్పుడూ నాకు ఇంటా, బయటా అన్నీ సమస్యలే. ఏం చేయాలో బోధపడటంలేదు. నన్ను అంతా రమణ అని పిలుస్తారు. ఇంట్లో భార్యతో రోజు గొడవే. ఆర్థికంగా కూడా బాగా దిగజారిపోయాను.అప్పులకూపంలో మునిగిపోయాను. నాకు మార్గం చూపండి.

వి. రమణ,చింతలపూడి

రమణ అనే ఆంగ్ల అక్షరాలలో మొత్తం ఆరు ఉన్నాయి. సంఖ్యాశాస్త్రం ప్రకారం మొత్తం కూడగా 21 సంఖ్య వస్తుంది. రెండు+ఒకటి=మూడు. ఇవి రెండూ బద్ధశత్రువులు. వీటికి ఫ్యామిలీ లైఫ్‌కి దగ్గర సంబంధం ఉన్నది. రేణుక, అమోద లాంటి పేర్లలో కూడా ఇలాంటి నంబర్లే ఉన్నాయి. మీరు మీ పేరును RAMMUNA గా రాయండి. దాని మొత్తం సంఖ్య 23 వస్తుంది. మీ స్టార్ తిరుగుతుంది. స్పెల్లింగ్ పైరకంగా రాసి మామూలుగా రమణ అనే పిలిపించుకోండి. PHONETICS ముఖ్యంకాదు. పేరులో ఉండే స్పెల్లింగ్‌కు OVER RIDING EFFECT ఉన్నది.

మీ లక్కీ నెంబర్ 5, 7, 2.

★★★

నా పేరు సుమతి. నా డేట్ ఆఫ్ బర్త్ 23-3-1954. నాకు వివాహం జరిగినప్పటినుంచి నా భర్తతో సఖ్యతలేదు. నేను గవర్నమెంట్ మెడికల్ డిపార్ట్‌మెంట్‌లో పనిచేస్తుంటాను. పదేళ్ల క్రితం మా వారు నానుండి విడిపోయారు. రోజూ డబ్బులు అధికంగా ఖర్చవుతున్నాయి. తరచుగా అనారోగ్యానికి గురవుతుంటాను. నా చేత సహాయం పొందినవారే నాకు ద్రోహం చేస్తున్నారు. నమ్మకద్రోహాన్ని తట్టుకోలేకపోతున్నాను.

**సుమతి, విశాఖపట్నం**

సుమతి అనే ఆంగ్ల అక్షరాలలో ఒక ఎ, యు, ఐ ఉన్నాయి. ఈ మూడు ఒవెల్స్‌ని కూడినట్లయితే డెత్ నంబర్ 13 వస్తుంది. దాని ప్రభావం వలన భర్తతో సంబంధం తెగిపోయింది. అధిక ఖర్చు, అనారోగ్యం కూడా దాని ప్రభావమే. మిమ్మల్ని ఎప్పుడూ ఎవరో ఒకరు బాధపెడుతూనే ఉంటారు. ఇదంతా ఆ డెత్ నంబర్ ప్రభావమే. మీకు బాగా తెలిసినవారు...మీ సహాయం పొందినవారే మీకు ద్రోహం తలపెడుతుంటారు. ఇదంతా కూడా ఆ చెడు నంబర్ ప్రభావమే. మీరు ఇక నుండి మీ పేరును SUMMATTHEEగా రాసుకోండి. దానిని 41 అనే ప్రభావవంతమైన నంబర్‌కింద మార్చడం జరిగింది. మీ లక్కీ నంబర్లు 1, 5. ఈ రకంగా మార్పుకున్నట్లయితే ఇకనుండి మీరు సంతోషకరమైన జీవితాన్ని అనుభవిస్తారు.

★★★

నా పేరు సుబ్రహ్మణ్యంరెడ్డి, నేను పుట్టినతేదీ 9-5-1966. నేను ఏ వ్యవహారం నడిపినా బెడిసికొడుతుంది. ఊరికే కోపం వస్తుంది. ఎంత సంపాదించినా ఏమీ దాచుకోలేదు. ఎక్కువగా నన్ను ఇతరులు బెదిరిస్తుంటారు.కొందరు సుబ్రమణ్యమ్ అని మరికొందరు సుబ్రహ్మణ్యం రెడ్డి అని పిలుస్తుంటారు. కొందరు రెడ్డి అని పిలుస్తుంటారు.

**పి. సుబ్రహ్మణ్యంరెడ్డి,హైదరాబాద్**

సుబ్రహ్మణ్యం అనే ఆంగ్ల అక్షరాలలో సంఖ్యాశాస్త్రం ప్రకారం 13వ నంబర్ ఉన్నది. సుబ్రమణ్యంరెడ్డి అనే పేరులో 16 అక్షరాలు ఉన్నాయి. ఇది కూడా చెడు ప్రభావం చూపే భయంకరమైన నెంబరే. రెడ్డి అని పిలిచినా అందులోనూ బ్లాస్టింగ్ నంబర్ ఉంది. అందుకని పైన మీరు చెప్పిన వ్యతిరేకతలు మీ పేరులో ఉన్నాయి. మీరు ఇక నుండి మీ పేరులోని ఆంగ్ల అక్షరాలను SUBRAMANYEMగా మార్చు కుని రాసుకోండి. దానితో అత్యంత ప్రభావంగల 34వ నంబర్ వస్తుంది. సంతకం కూడా అలానే చేయండి.

2, 7 మీ లక్కీ నంబర్లు.

★★★

నా పేరు బిఎస్ మనోహర్‌గౌడ్. 30-10-1985 నా డేట్ ఆఫ్ బర్త్. ఎమ్ఎస్‌సి బియిడి పూర్తిచేశాను. ఉద్యోగం దొరకడంలేదు. చాలా కష్టాల్లో ఉన్నాను. దారిచూపండి. మీ సూచనల ప్రకారం నా పేరులో మార్పులు చేసుకుంటాను.

**బిఎస్ మనోహర్‌గౌడ్, రామాయంపేట**

బిఎస్ మనోహర్‌గౌడ్ అనే పేరులో 12వ నంబర్ ఉంది. దీనిని సంఖ్యాశాస్త్రంలో రివర్స్ నంబర్ అంటారు. ఈ నంబర్ ప్రభావం వలన అంతా నెగెటివ్‌గా ఉంటుంది. అయితే మనోహర్ అనే పేరులో కూడా బ్లాస్టింగ్ నంబర్‌ను సూచించే 16వ నంబర్ ఉంది. ఇది కూడా నెగెటివ్ ప్రభావం చూపించే అంశమే. అందుకని మీ పేరులోని ఆంగ్లంలో స్పెల్లింగ్‌ను మార్చుకుంటే మీకు అన్నివిధాలా బాగుంటుంది MANNOHHUR గా రాసుకోవాలి. మీ అదృష్ట సంఖ్యలు 9,4. పైన సూచించిన సింగిల్ నెంబర్‌నే జీవితాంతం ఉపయోగించుకోవాలి.

★★★

నా పేరు టి. జాగృతి. నా జీవితంలో ఇప్పటిదాకా అన్నీ కష్టాలే. యాక్సిడెంట్స్ కూడా జరిగాయి. నేనంటే అటు బంధువుల లో...అయినవారికీ, స్నేహితులకీ ఎవరికీ పడదు. 6-4-1975 నా డేట్ ఆఫ్ బర్త్.

**జాగృతి, వేమూరు**

జాగృతి అనే మీ పేరులో ఉన్న ఆంగ్ల వొవెల్స్ ప్రకారం 13వ నంబర్ సూచిస్తున్నది. దీనిని డెత్ నంబర్ అంటారు. దీని ప్రభావం వలన పై ఫలితాలను అనుభవిస్తున్నారు. మీ పేరును JHAGRUTHY అని రోజుకు 28 సార్లు 28 రోజులు 5 కోర్సులుగా మీ పేరున రాసుకోండి. 1,9 మీ లక్కీ నంబర్లు. ఇంటిపేరును వాడకుండా ఉంటే మంచిది. పైన సూచించిన విధంగా మీ పేరులోని స్పెల్లింగ్‌ను మార్చుకుని జీవితాంతం రాసుకుంటే మంచి ఫలితం ఉంటుంది. మిమ్మల్ని అంతా ఇకనుండి అభిమానిస్తారు.

★★★






అంతా నిన్ను అవమానిస్తున్నప్పుడు, వినయంగా వుండడం మంచిది కాదు. కానీ అందరూ నిన్ను ప్రశంసిస్తున్నప్పుడు వినయంగా వుండడం మాత్రం చాలా అరుదయిన విషయం. -సెయింట్ బెర్నార్డ్

# సురభి సొగసులు ...

మరీ ఈ రేంజ్‌లో రిక్వెస్ట్ చేస్తున్నది హీరోయిన్‌గారి అసిస్టెంట్ లేదా మేకప్‌మేన్ కాదు, హీరో అల్లు శిరీష్. సెట్టింగు, లైటింగు, సినిమా వింగ్ వింగు మొత్తం రెడీ. కానీ, హీరోయిన్ సురభి రెడీగా లేరు. మేకప్‌కి మెరుగులు అద్దుతూ టచప్ చేసుకుంటుండడంతో అందరూ వెయిటింగు అన్నమాట! కరెక్టుగా అప్పుడు సెట్‌లో ఓ కెమెరా క్లిక్‌మంది. ఆ ఫొటోనే మీరు చూస్తున్నారు. అల్లు శిరీష్, సురభి జంటగా వీఐ ఆనంద్ దర్శకత్వంలో ఓ సినిమా చేస్తున్నారు కదా. ఈ సీన్ ఆ సెట్‌లోది అన్నమాట. ఇప్పుడు ఈ సినిమా షూటింగ్ హైదరాబాద్‌లో జరుగుతోంది. సీరత్ కపూర్ మరో హీరోయిన్‌గా నటిస్తున్న ఈ సినిమాను చక్రి చిగురుపాటి నిర్మిస్తున్నారు. మణిశర్మ స్వరకర్త.



## సమంత చైతూని ఒప్పించింది



సమంత సోషల్ మీడియాలో చాలా యాక్టివ్. సరదా కామెంట్లు చేస్తూ.. ఫన్నీ వీడియోలు షేర్ చేస్తూ.. అభిమానుల్ని అలరిస్తూ ఉంటుంది సామ్. అందుకే ఆమెను 30 లక్షల మందికి పైగా అనుసరిస్తున్నారు. సమంత అల్లరిని వీళ్లందరూ భలేగా ఎంజాయ్ చేస్తుంటారు. ఐతే సమంత వరించిన వాడు మాత్రం ఆమెకు పూర్తి భిన్నం. రిజర్వ్ గా ఉండే నాగచైతన్య సోషల్ మీడియాలో అంత యాక్టివ్ గా ఉండడు. తన పర్సనల్ థింగ్స్ ఏవీ జనాలతో పెద్దగా షేర్ చేసుకోడు. బయట కూడా అక్కినేని కుర్రాడు సైలెంటుగా ఉంటాడు. అలాగని సమంత ఊరుకుంటుందా? ఎందుకూరుకుంటుంది..? చైతూను కూడా తన దారిలోకి లాగే ప్రయత్నం చేస్తూ ఉంటుంది.

ఆ మధ్య చైతూ వంట చేస్తుండగా.. అతడికి తెలియకుండా ఫొటోలు తీయడమే కాదు.. వాటిని సోషల్ మీడియాలోనూ షేర్ చేసేసింది సామ్. ఈ సంగతి తనకు తెలియదని చైతూ ఈ మధ్యే ఓ ఇంటర్వ్యూలో చెప్పాడు. దాంతో పాటుగా మరికొన్న ఫొటోలు.. వీడియోలు కూడా బయటికి వచ్చాయి. తాజాగా చైతూ జిమ్ వర్కవుట్ చేస్తున్న వీడియోను షేర్ చేసింది సమంత. ఈసారి మాత్రం చైతూకు తెలిసే వీడియో షేర్ చేసిందట సమంత. ఎంతో చెప్పాక కానీ.. చైతూ కన్విన్స్ అవ్వలేదని.. తర్వాతే ఈ వీడియో పోస్ట్ చేశానని అంది సామ్. చైతూ 161 కిలోల వెయిట్స్ మోస్తూ కనిపించాడు ఈ వీడియోలో. దీంతో పాటు సమంత కూడా తాను బరువులు మోస్తున్న వీడియో ఒకటి షేర్ చేసింది. అందులో సమంత కూడా తన స్థాయిలో బాగానే బాగానే బరువులెత్తి తన స్టామినా చూపించిందిలెండి.





పరిపాలించడంకన్నా, ఒకరికి విధేయుడుగా వుండటమే అన్ని విధాల ఉత్తమం. -థామస్ ఎ.కెంపిస్

సూర్య

# జీవవైవిధ్యానికి ముంచుకొస్తున్న ముప్పు

**భూమిమీద వివిద రకాల జీవులు మధ్య ఉన్న బేధమే జీవవైవిద్యం.అనేక మిలియన్ల వివిద జాతుల మధ్య జీవవైవిద్యం 3.5 బిలియన్ సంవత్సరాల పరిణామ క్రమం.ఆ జీవులు జీవన విధానం, ఆహారపు అలవాట్లే మానవ మనుగడకు దోహదం చేస్తున్నాయి.అయితే ప్రపంచ యాంత్రికీకరణ వల్ల జీవవైవిద్యానికి పెను ముప్పు ముంచుకొస్తుంది. జీవజాతులు అంత రించి జీవ వైవిద్యాన్ని దెబ్బతీస్తోంది. మనిషి ఆధునిక పోకడలు పశుపక్ష్యాదులు పాలిట శాపంగా పరిణమిస్తున్నాయి.ఎన్నో జీవజాతులు అంతరించి పోతున్నాయి.మే 22న జీవవై విద్య దినోత్సవాన్ని పురస్కరించుకుని, జీవవైవిద్యానికి సంబంధించి ప్రత్యేక కథనం.**

ప్రపంచంలో మాహా జీవవైవిద్య ప్రాంతాలు 12 ఉన్నాయి. అందులో భారత దేశం ఒకటి. గతంలో మన దేశంలో సుమారు 45వేల వృక్షజాతులు, 77 వేల జంతుజాతులు ఉన్నాయి. ప్రస్తుతం అందులో 10శాతం పెను ముప్పును ఎదుర్కొంటున్నాయి. ఇందులో చాలా జాతులు అంతరించి పోయే దశలో ఉన్నట్లు తెలుస్తోంది. అభివృద్ధి పేరుతో మనం అటు అడవులను, ఇటు నీటి వనరులను నాశనం చేయడం, పారిశ్రామికీకరణ పేరుతో మైదాన ప్రాంతాలు మాయం కావడం, పచ్చిక బయళ్లు కాంక్రీట్ జంగిల్లుగా మారడం. జీవవైవిద్యానికి చేటు తెచ్చి పెడుతున్నాయి. పైగా సముద్ర, నదీ తీరాలను ఆక్రమిస్తున్నాము. చెట్టు పుట్టలు మాయం అవుతున్నాయి. చివరకు పచ్చదనం మచ్చుకైనా లేకుండా పోతోంది. ఇదంతా భూతాపానికి కారణమే కాకుండా, వివిద రకాల పక్షులు అంతరించి పోవడానికి కారణం అవుతోంది. వాతావరణ కాలుష్యం, జలకాలుష్యాలను పెంచుతోంది. ఇక అధిక దిగుబడుల పేరుతో మితిమీరిన క్రిమిసంహారకాలు భూకాలుష్యాన్ని పెంచుతోంది. తద్వారా వాటి మీద ఆధారపడి జీవనం సాగించే జీవజాతుల మనుగడ ప్రశ్నార్థకంగా మారుతోంది. ఇక అరణ్యాలను హరించడమే కాకుండా, అడవి జంతువులను వేటాడి చంపుతున్నారు. ఇలాంటి అవాంఛనీయ చర్యల వల్ల మానవాళి దారుణంగా నష్టపోవడమే కాకుండా, అపారమైన జీవజాతులు అంతరించపోయేందుకు దోహదం చేస్తోంది.

## జీనశైలిలో మార్పులే కారణం.

జీవవైద్యం దెబ్బతినడానికి ప్రధమ కారణం మారుతున్న మనిషి జీవన శైలి. విలాసవంతమైన జీవితం కోసం భవిష్యత్తును ఫణంగా పెడుతున్నాడు మనిషి. తెలిసి కొంత, తెలియక కొంత, సరైన అవగాహ లేక మరికొంత. మొత్తానికి జీవవైవిద్యం దెబ్బతినడానికి కారణం అవుతున్నాడు నాగరికుడు. ఎందుకంటే మనదేశంలో ఆదివాసులైన గిరిజనులు, కొండజాతి వారు జీవించే ప్రాంతాల్లో జీవవైవిద్యం చాలా ఎక్కువగా ఉంది. మున దేశంలో 53 మిలియన్ల మంది ఆదివాసీలు ఉన్నారని అంచనా. వీరిలో ఎక్కవగా మేఘాలయ,నాగాలాండ్, మిజోరం, అరుణాచల్ ప్రేదశ్‌లలో దాదాపు 80శాతం మంది జీవిస్తున్నారు. ఈ ప్రాంతాల్లోనే జీవవైవిద్యం పదిలంగా ఉంది. ఇక్కడ పంటల్లోనూ జీవవైవిద్యం కనిపిస్తుంది. అంతే కాకుండా వీరికి ఆధుక సేద్యం అంతగా తెలియదు. అందుకే క్రిమి సంహారకాలు, హైబ్రిడ్ విత్తనాలు వాడకం తెలీదు. మరోవైపు పెరిగిన శాస్త్రపరిజ్ఞానం మనల్ని కొత్తపుంతల్ని తొక్కిస్తుంది. నూతన ఆవిష్కరణలకు దారితీస్తుంది. ఇవి కూడా హద్దు మీరితే, తగు జాగ్రత్తలు తీసుకోక పోతే జీవవైవిద్యానికి తీవ్ర విఘాతం కల్గిస్తాయి. అందులో ఒకటి జన్యు మార్పిడి. జన్యుమార్పిడివల్ల దీర్ఘ, స్వల్పకాలిక ప్రబావాలా ఎలా ఉంటాయో పూర్తిగా అద్యయనం చేయకుండా ఏ జీవజాతుల్లో ప్రవేశ పెట్టినా, ప్రస్తుతం ఉన్న జీవజాతులకే పెము ముప్పు తప్పదు.

## ఆందోళన చెందుతున్న ప్రపంచ దేశాలు

మానవాళి మనుగడకు ప్రకృతి, జీవవైవిద్యం రెండు కళ్లలాంటివి. ఏ కన్ను పొడుచుకున్నా మనుగడే గాడి తప్పుతుంది. జరగాల్సిన ముప్పు జరిగిన తర్వాత ఇప్పుడు ప్రపంచ దేశాలు జీవవైవిద్యం దెబ్బ తినడంపై ఆందోళన చెందుతున్నాయి. జీవవైవిద్యం కాపాడుకునేందుకు చర్యలకు ఉపక్రమిస్తున్నాయి. ప్రస్తుతం అనేక జీవజాతులు అంతరించి పోవడానికి కారణాల అన్వేషణలో పడ్డాయి. అద్యయనాలు, పరిశోధనలు చేస్తున్నాయి.ప్రజల్లో అవగాహన పెంచేందుకు ప్రపంచ వ్యాప్తంగా దాదాపు రెండు వందల దేశాల్లో జీవవైవిద్య ఉత్సవాలు నిర్వహిస్తున్నాయి. ఇక ప్రపంచం మొత్తం మీదు ఉన్న అటవీ సంపదలో 12 శాతం మన దేశంలోనే ఉంది. కాని ప్రభుత్వాల నిర్లక్ష్యం కారణంగా అడవులు అంతరించిపోతున్నాయి.విశేషం ఏమిటంటే 5,727 వృక్షజాతులు మన అడవుల్లో ఉన్నాయి. ప్రభుత్వాల వైఫల్యం వల్ల అవి అంతిరించే ప్రమాదం లేకపోలేదు. మాహాజీవవైవిద్యం ప్రాంతాల్లో మన భారతం ఒకటి కాబట్టి, దేశంలోని అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు కళ్లు తెరవాలి. జీవవైవిద్యం కాపాడుకునేందుకు చర్యలు తీసుకోవాలి. పర్యవరణం కోసం, జంతు జాతులు సంరక్షణ కోసం పనిచేసే స్వచ్ఛంద సంస్థలను ప్రోత్సహించాలి. తరుచూ జీవవైవిద్యంపై కార్యక్రమాలు నిర్వహించి ప్రజల్లో అవగాహన పెంచాలని మేదావులు, పర్యావరణ వేత్తలు, జంతు,పక్షి ప్రేమికులు కోరుతున్నారు.

## జంతువుల పరిరక్షణతోనే జీవవైవిద్యం

జీవావరణంలోని రకరకాల జీవులపైనే మానవుని మనుగడ ఆధారపడి ఉందన్నది అక్షర సత్యం. మనం పీల్చే స్వచ్ఛమైన గాలి చెట్లనుంచి లభించినట్లే, రకరకాల జీవులు ఉండడం వల్లే మనకు తాజానీరు, ఆహారం, ఔషధాలు మొదలైనవి లభిస్తున్నాయి. అటవీ సంపద వల్లే రకరకాల జంతుజాతులు మనగల్గుతున్నాయి. వాతారమంలోని అనూహ్యమైన మార్పులు, కాలుష్యం మూలంగా వాతావరణం వెడెక్కి భూతాపం పెరిగిపోవడం, ప్రకృతిలో సంభవిస్తున్న అవాంఛనీయ మార్పులు కారణంగా జీవవైవిద్యానికి పెనుముప్పు ఏర్పడింది. ప్రపంచం మీద ప్రతి 20 నిమిషాలకో జీవి అంతరించి పోతుందనేది ఓ అంచనా. అభివృద్ధి పేరుతో నాగరిక మానవులు అడవుల విధ్వంసానికి పూనుకుంటున్నారు. వర్షాలు లేక చెరువులు కుంటలు, అటవీ ప్రాంతంలోని సెలయేరులు వట్టిపోతున్నాయి. దీంతో దాహం తీర్చుకునేందుకు వన్యప్రాణులు జానావాసాల్లోకి వస్తున్నాయి. మావ మృగాల భారిన పడుతున్నాయి. ముఖ్యంగా అభయారణ్యాల్లో ఉండే చిరుతలు, జింకలు, దుప్పులు తదితర వన్యప్రాణులు నీటికోసం వ్యవసాయ క్షేత్రాలకు, జనావాసాలకు వస్తున్నాయి.వేటగాళ్లు ఉచ్చులో వడి ప్రాణాలు విడుస్తున్నాయి. పరోక్షంగా పర్యావరణానికి ఎంతో మేలు చేసే మూగజీవాలైన రాబంధులు, కృష్ణ జింకలు, పులులు, సింహాలు నానాటికి అంతరించి పోతున్నాయి. అటవులు అంతరించే క్రమంలో దానిపై ఆధారపడే జీవజాతులు అంతరిస్తున్నాయి. అందుకే జీవజాతుల పరిరక్షణతోనే జీవవైవిద్యం సాధ్యం. అందుకోసం ముందు అడవులను పరిరక్షించుకోవాలి. ఒక మొక్కను నాటితే రెండు మొక్కలు పెంచైటపఏ దిశలో మనిషి ముందడుగేయాలి. తద్వారా జంతువుల పరిరక్షణ సాధ్యం అవుతోంది. అంతేకాకుండా జంతువులను విచక్షణ రహితంగా వేటాడి చంపే వారిపై కఠిన చర్యలు తీసుకోవాలి. వాటి జోలికి వెళితేనే భయపడేంత కఠింగా శిక్షలు అమలు కావాలి. లేదంటే అభివృద్ధి పేరుతో అడవుల విధ్వంసం ఓపక్క, ఆహారం నీరు అందక, వేటగాళ్లు బారిన పడి జంతువుల అంతరించి పోవడం మరో పక్క జరిగితే, భావితరాల మునుగడకు పెను ముప్పు తప్పదన్న నగ్నసత్యాన్ని మనం గుర్తించాలి.

## జీవవైవిద్య పరిరక్షణకు మనమేం చేయాలి?

జీవవైవిద్య పరిరక్షణను దృష్టిలో ఉంచుకొని అనేక చట్టాలు వచ్చాయి.కానీ అవేవి సక్రమంగా అమలవుతున్న దాఖలాలు లేవు. అయితే ఏ చట్టం అమలు కావాలన్నా ప్రజల సహకారం అవసరం.అందుకే చట్టాల మాట ఎలా ఉన్నా జీవవైవిద్య పరిరక్షణకు మనం ఏమి చేయాలో ఆలోచిద్దాం. పెరిగి పోతున్న కాలుష్యం, వాతావరమంలో మార్పుల ప్రభావం, సహజ వనరులను అసంబద్ధంగా వినియోగించుకోవడం, అభివృద్ధి కార్యాక్రామాల పేరుతో ఆవాస ప్రాంతాలు కుంచించుకు పోవడం అందుకే పైన ఎచెప్పిన విషయాలు దృష్టిలో ఉంచుకోవాలి. అలా జరగకుండా చూసుకోవాలి.

+ సకల ప్రాణులకు జీవనాధారమైన అభయారణ్యాలను, అడవులను, అందులోని జంతువులను మనం పరిరక్షించుకోవాలి.
+ కనుమరుగువుతున్న జీవజాతులను, అరుదుగా కనిపంచే జీవజాతులను పరిరక్షించుకోవడం మన బాధ్యతగా భావించాలి.
+ మూగ జీవాలపైన దయ, ప్రేమ చూపాలి.
+వాతావర ణ కాలుష్యాన్ని అరికట్టాలి.
+వణ్యప్రాణి,పర్యావరణ ప్రేమికులు జంతువులను దత్తత తీసుకోవాలి
+అవసరం అయిన చోట జంతు సంరక్షణ కేంద్రాలు ఏర్పాటు చేయాలి.
+ముఖ్యంగా వన్యప్రాణుల సంరక్షణతోనే జీవవైవిద్యం పరిరక్షించబడుతుందనే సత్యాన్ని గుర్తించి మసలు కోవాల్సిన బాధ్య మనందరిపైనా ఉంది.

## ముగింపు

గత చరిత్రను ,మన పూర్వీకుల అనుభవాలు,వైభవాలను స్మరించుకుంటూ, ఆనందంగా గడపడానికి మనం ఎన్నో పండుగలు చేసుకుంటాం. సమాజానికి స్ఫూర్తి నిచ్చేందుకు దినోత్సవాలు జరుపుకుంటున్నాం. ఏది చేసినా,ఏ దేశంలో చేసినా,ఎక్కడ చేసినా మానవాళి కళ్యాణం కోసమే. మన బాధ్యతను గుర్తు చేసుకుంటాం. జీవవైవిద్యం విషయంలోను అదే విధంగా చేయాలి. జీవవైద్య దినోత్సం రోజు,( మే 22) ప్రజల్లో దానిపై అవగాహన పంచేవిధంగా, బాధ్యత గుర్తించే విధంగా కార్యక్రమాలు నిర్వహించుకుందాం. జీవవైవిద్యాన్ని కాపాడుకుందాం!

## అంతరించి పోతున్న ఊరపిచ్చుకలు

ఊరపిచ్చుక..ఏంటీ ఈపేరు ఎక్కడో విన్నట్లు ఉందా? అసలు ప్రస్తుతం తరానికి ఊరకపిచ్చుక ఎలా ఉ ంటుందో తెలుసా? ఉరుకులు పరుగులు యాంత్రిక జీవనంలో, మన ఇంటి పైకప్పుల్లో చిన్ని గూడు నిర్మించుకుని, మనతో పాటు జీవనం సాగించిన ఆత్మీయ నేస్తాన్నే మరిచి పోయాం కదూ. అదే కాదు మనం దసరా రోజు జమ్మిపూజి చేసివస్తూ, మంచి జరిగేందుకు చూసే పాలపిట్ట, వేకువ జామను కా...కా అంటూ మనల్ని నిద్దుర లేపే కాకుకులు, చెట్టుబెరళ్లను ఫట్ పట్ మంటూ తొలిచే వండ్రంగి పిట్టలు ఏమయినట్లు? ఎందుకు కనిపించడంలేదు? ఊర్లు ఉన్నాయి. కాని ఈ పిచ్చుకలే కనుమరుగవతున్నాయి. పల్లెల్లోను ప్రపంచీకరణ పోకడలు, ఇళ్ల నిర్మాణంలో సంభవించిన మార్పులు, ఊరపిచ్చుకలే కాదు పక్షుల పాలిట ఉరితాళ్లవుతున్నాయి. ముఖ్యంగా మన జీవన శైలితో పెనవేసుకున్న ఊరపిచ్చుక మనుగడ మాత్రం తీవ్ర ప్రమాదంలో పడింది.కిచకిచ రావాలతో ఇంటిల్లి పాదికి ఓసారి చిరాకును మరో సారి ఆనందాన్ని ఇచ్చే ఊరపిచ్చుకకు మనిషి జీవితంలో విడదీయరాని అనుబంధం. దాంపత్య జీవితానికి, సంతానోత్పత్తిలో, వాటిని పోషిం చడంలో....ఒక్క మాటలో చెప్పాలంటే మానవ కుటుంబ వ్యవస్థకు, ఊరపిచ్చుక జీవన శైలికి చాలాదగ్గరి పోలికలు ఉన్నాయి. మనుషుల మధ్య కలివిడిగా ఉంటూ, మనలో ఒకటిగా కలిసోపోతూ జీవించే ఊరపిచ్చుక, ఇండ్లు ఇరుకై పోయి, చెట్లు అంతరించిపో తుంటే ఎలా మనగల్గుతుంది.. అందుకే నానాటికి ఊరపిచ్చుక అంతరించిపోతోంది. పట్టణాల్లో వాటి జాడకోసం భూతద్దం పెట్టి వెతకాల్సి వస్తుంది. పల్లెల్లో సైతం గతంలో వేలసంఖ్యలో దర్శనమిచ్చే ఊరపిచ్చుకలు, ప్రస్తుతం వందల సంఖ్యలో కూడా కనిపించకుండా పోయాయి.ఇదే పరిస్థితి ఇలాగే కొనసాగితే భావితరాలకు గతంలో ఊరపిచ్చుకలు ఉండేవని చెప్పుకోవాల్సిన పరిస్థితులు దాపురించనున్నాయి. అంతేకాదు ఇప్పటికైనా మనం మేల్కోక పోతే.. వాటి బొమ్మలు చూపి ఇదిగో ఇలా ఉంటుంది ఊరపిచ్చుక అని బావితరాలకు చూపించాల్సిన పరిస్థితులు తలెత్తే ప్రమామం పొంచి ఉంది.

> **మానవునికి సన్నిహింతంగా ఉండే ఊరపిచ్చుకల పరిస్తితే ఇలా ఉంటే వేరే పక్షుల మాటేంటేనేది ప్రస్తుతం వేధిస్తున్న ప్రశ్న. ఇంకా ఎన్ని పక్షిజాతులు అంతరించాయి, ఎన్ని ఉన్నాయనే ప్రశ్నలు ఆందోళన కల్గిస్తున్నాయి.ఇలాగే పక్షిజాతులు అంతరిస్తే జీవవైవిద్యానికి తీవ్ర విఘాతం కల్గడం ఖాయం.**

## ఊరపిచ్చుకల ఉసురు తీస్తున్నాం!

ఊర పిచ్చుక,..ఇంటి పిచ్చుక..లవ్లీ బర్డ్...ఎందుకు అంతరించి పోతోంది? కారణాలేంటి? ఈప్రశ్నలతో ప్రపంచ వ్యా ప్తంగా అద్యయనాలు మొదలైనాయి. జరిగాల్సిన ఘోరం జరిగాక, అవి అంతరించి పోవడానికి గల కారణాలపై అన్వేషణ ప్రారంభమైంది. ఊర పిచ్చుక శాస్త్రీయ నామం ప్యాసర్ డొమెస్టికస్.గతంలో ఎక్కడ చూస్తే అక్కడ కనిపించే పిచ్చుకలు, ప్రస్తుతం అంజనం వేసి గాలిం చినా దొరకేలా లేవు. పల్లెల్లో విచ్చలవిడి పురుగుల మందుల వాడకం పక్షుల ఆహారాన్ని విషతుల్యం చేస్తుంటే, పట్టణాల్లో కాలు ష్యం వాటి మనుగడను ప్రశ్నార్థం చేస్తోంది. దీంతో ఊరపిచ్చుకల జాతి ప్రమాదంలో పడింది. పూర్వం ఊరపిచ్చుకలు ఇంటి కప్పులు, పెంకుటిళ్లయితే వాటి సందుల్లో, పూరిగుడిసెల్లో ఇలా మొత్తానికి 90 శాతం ఇళ్లలోనే గూడు ఏర్పాటు చేసుకునేవి. ఆడ మగ కలిసి జీవించేందుకు నిర్ణయించుకున్నాక, రెండూ కలిసి గూడు నిర్మింకునేవి. సంసారంలో కష్టసుఖాలు భార్యాభర్తలకు సమానం అనే సిద్ధాంతం ఇక్కడ కనిపిస్తది. అలా గూడు నిర్మించుకున్నాక, గుడ్డుపెట్టి సంతానోత్పత్తి చేసుకునేవి.ఆ తర్వాత అవి పెరిగి పెద్దై, తమ రెక్కలమీద తాము ఎగరగలిగేవరకు, ఆడ, మగ పిచ్చుకలు కలిసి వాటిని పోషించడం చూస్తే ముచ్చటేసేది.

## ఊరపిచ్చుక అంతరించపోవడానిక కారణాలేంటి?

కర్ణుని చావుకు కారణాలు అనేకం అన్నట్లు ఊరపిచ్చుకలు అంతరించి పోవడానికి అనేక కారణాలున్నాయి. వేగంగా పెరిగి పోతున్న పట్టణీకరణ ఊరపిచ్చుకను ప్రమాదంలోకి నెట్టేసింది. ఆది నుంచి ఇళ్లల్లోనే గూడు ఏర్పాటు చేసుకునేందుకు అలావాటు పడిన వీటికి, కాంక్రీట్ జంగిల్స్ పుణ్యమా అంటూ వాటిని గూడుకు దూరం చేసింది. పెరిగి పోయిన వాతావరణ కాలుష్యం వాటికి ఊపిరాడకుండా చేసి ఉసురు తీస్తోంది.ఇక చెట్లను ఆశ్రయిద్దామంటే, ఆవాసాల కోసం వాటిని నరికేయడంతో ఆఛాన్స్ మిస్సవుతోంది. ఆహారం కొరత మొదలైంది. ఇక పల్లెల్లో పురుగల మందుల వాడకం వల్ల ఆహారం విషం తుల్యం అవుతోంది. పైగా గ్రామాల్లో రైతులు వ్యవసాయం పట్లు విముఖత చూపుతుండడం, వారి పిల్లలు పట్టణాల్లోకి వెళ్లి పోవడంతో ,సేద్యం తగ్గిపోతోంది. దీంతో పల్లెల్లో సైతం వాటికి ఇన్ని తిండి గింజలు దొరకని పరిస్థితి. ప్రస్తుతం కొద్దిగానైనా పిచ్చుకలు కనిపిస్తున్నాయంటే అదీ పల్లోనే. ప్రస్తుతం పల్లెలుకూడా పట్టణాలవైపు పరుగులు పెడుతుండడంతో భవిష్యత్తులో అక్కడా కనుమరుగు కావడం ఖాయం.

## పిచ్చుక మనుగడపై సెల్ టవర్ల ప్రభావం!

ఆధుకునిక పోకడలు పిచ్చుకల జాతిని ప్రశ్నార్థకం చేస్తున్నాయి. ముఖ్యంగా సెల్ ఫోన్‌ల వాడకం పెరిగి పోవడంతో ఊరూరావెలిసిన సెల్‌టవర్ల నుంచి వచ్చే రేడియేషన్ ఊరపిచ్చుకల పాలిట శాపంగా మారింది.. గతంలో ఊరపిచ్చుక లేహ్యం ,మనిషిలో సెక్స్ సామర్ద్యం పెంచుతుందని చెప్పేవారు పెద్దలు. సెల్ టవర్ల పుణ్యమా అంటూ రేడియేషన్ ప్రభావం వల్ల పిచ్చుకల్లోనే సెక్స్ సామర్ధ్యం తగ్గిపోతుంది. ప్రతికూల పరిస్థితులు మూలంగా పునరుత్పత్తి చేయలేక పోవడం కూడా ఆ జాతి అంతరించి పోవడానికి ఒక కారణమి శాస్త్రీయ అధ్యయనాలు తేటతెల్లం చేస్తున్నాయి.సెల్ ఫోన్ టవర్లు, సిగ్నళ్లు ఊరపిచ్చుకలు అంతరించి పోవడానికి ఓ కారణమని, సలీం అలీ సెంటర్ ఫర్ ఆర్నిథాలజీ అండ్ నేచురల్ హిస్టరీ ప్రతినిధులు తేల్చేశారు. సెల్ ఫోన్ సిగ్నళ్ల తీవ్రత, పక్షుల అంతర్ధానానికి మధ్య ఉన్న సంబంధం అనే అంశంపై జరిగిన పలు అధ్యయనాల్లో ఈ విషయం స్పష్టమైంది. సెల్‌ఫోన్ సిగ్నళ్ల తీవ్రతలో ఊరపిచ్చుకలు జీవించలేవని స్పెయిన్‌లో జరిగిన పరిశీలనలోనూ వెల్లడైంది.,సెల్ ఫోన్ యాంటీనాల్లోంచి వచ్చే విద్యుత్ అయస్కాంత తరంగాలు పిచ్చుకలను తరిమి వేస్తున్నాయని లండన్‌లో జరిగిన పరిశోధనలో తేటతెల్లమైంది. మానవునికి సన్నిహింతంగా ఉండే ఊరపిచ్చుకల పరిస్తితే ఇలా ఉంటే వేరే పక్షుల మాటేంటేనేది ప్రస్తుతం వేధిస్తున్న ప్రశ్న. ఇంకా ఎన్ని పక్షిజాతులు అంతరించాయి, ఎన్ని ఉన్నాయనే ప్రశ్నలు ఆందోళన కల్గిస్తున్నాయి.ఇలాగే పక్షిజాతులు అంతరిస్తే జీవవైవిద్యానికి తీవ్ర విఘాతం కల్గడం ఖాయం.





లోభి సంచుల కొద్దీ కూడబెట్టిన ధనం పరుల పాలవుతుంది. తేనెటీగలు ఎంతో కష్టపడి కూడబెట్టిన తేనె ఇతరులు తాగిపోయినట్టు -పంచతంత్రం

పురుషులు స్వార్థానికి లోబడి పొరపాట్లు చేస్తారు. స్త్రీలు మాత్రం బలహీనతలకు వశమై పొరపాట్లు చేస్తారు.-మదామ్ దస్తాల్

